## 16-చిన్న నాటి మిత్రుల కథ . 25-11-22

మావూరిలో నా చిన్నతనం లో నాకో బాల్య మిత్రుడు ఉండేవాడు . వాడు చదువులో మొద్దు బండ.నే , కానీ, లౌకికమైన తెలివిలో బంగ్గారు కొండ . ఐదో తరగతి పూర్తి అయ్యే వరకూ మేమిద్దరమూ వీధి బడిలో పక్కపక్కన కూచునే వాళ్ళము . జోగీ జోగీ రాసుకుంటే బూడిద రాలుతుందన్నట్లు - మీ జత బాగా సరి పోయిందిరా " అని మా పంతులు గారు మా జంటను తెగ మెచ్చుకునే వాడు . ఇతడు నాకు టెన్త్ క్లాస్ పూర్తి అయ్యే వరకూ మిత్రునిగా వున్నాడు . వాడి గురించిన కథ ఇది
వాళ్ళ నాన్నది ఆకు కూరల వ్యాపారం . అయన అన్ని రకాల ఆకుకూరలు రకానికి ఒక వంద చొప్పున అనుకోండి ఒక తోపుడు బండిమీదకి ఎక్కించి ఒక కూడలిలో అమ్మకానికి పెట్టేవాడు . అయన అప్పటికే ఓపిక లేనికొబ్బరి పుల్లలా ఉండేవాడు . . అందుకని బండి తోసుకొని ఇంటింటికి తిరిగి అమ్మలేక, సెంటర్ లోనే బండి పెట్టి కూచ్చుని ఉండేవాడు . . సెంటర్ లోనేమో, వచ్చి పోయే జనంతో మంచి గిరాకీ ఏ ఉండేది కానీ , ఈయనలాగానే మరి ఐదారుగురు కూడా అదే సెంటర్ లోఉండటం వల్ల, వ్యాపారం గాలి వాటం గా సాగుతుండేది . జనం అచ్చం ఈయన దెగ్గరే కొనక పోవటం అనేది సహాజమేగా ? . దానివల్ల ఆయనకు ఎన్నో ఆకుకూరలు మిగిలిపోవటం నష్టం రావటం జరిగి, ఆ తండ్రికి కుటుంబం నడపటం కష్టంగా ఉండేది .
వీడు ఒకనాడు తండ్రి దెగ్గరికి వెళ్లి రేపు స్కూల్ లో పరీక్ష ఫీజు కట్టాలి అన్నాడు . " " చదువొద్దు చుట్టు బండలూ వద్దు .. ఇంకో బండి పెడతాను . నువ్వుకూడా బండి మీద పెట్టిన ఆకుకూరలు అమ్ము" అన్నాడు తండ్రి . బుద్ధిమాన్ అయినా వాడు తండ్రి మాటని శిరసావహించాడు .తనకోసం అని వేరే పెట్టిన బండికి ఒక పలక కట్టాడు . చాక్ పీసుతో దానిమీద " నేను తొమ్మిదింటికల్లా బడికి పోవాలి " అని రాసాడు . పైగా ఒక పుస్తకం చేత పట్టుకొని ఎదో చదువుతూ ఆ బండి దగ్గర కూచునే వాడు . .మీకు తెలుసుగా ఆకు కూరలకు పెద్దగా బేరం చెప్పేది ఏమీ ఉండదు . ఎవరికీ ఇష్టమైనవివారు నాలుగు కట్టలు - తీసుకోవటం రొండు రూపాయలు ఇచ్చుకోవటం.
" నేను తొమ్మిదింటికల్లా బడికి పోవాలి " అని వాక్యాలు చదివిన వారు " చదువుకునే పిల్లాడికి మేలు చేసినట్లు అవుతుందని " వీడి దెగ్గారనే ఆకు కూరలు కొనటం మొదలెట్టారు . పైగా పిల్లాడి చదువెందుకు డిస్టర్బ చేయటం అని - ఒక రొండు రూపాయలు అక్కడ పెట్టేసి నాలుగు

ఆకుకూర కట్టలు పట్టుకు పోయే సెల్ఫ్ సర్వీస్ కూడా అలవాటు చేసుకున్నారు . ఈ రకంగా ఎటువంటి శ్రమ లేకుండా , మావాడి సరుకు మొత్తం ఉదయం ఎనిమిదింటికల్లా చెల్లు బాటు అయ్యేది . ఒకవేళ ఎమన్నా అమ్ముడు పోనీ సరుకు ఉంటే వాడు బండి దెగ్గర ఆగిస్కూల్ ఎగవేసేవాడు కాదు . టైం కాగానే స్కూల్ బాగ్ పట్టుకొని - బండిని నడిరోడ్డుమీద దాని ఖర్మానికి దాన్ని వదిలేసి , స్కూల్కి ఠంచనుగా హాజరు అయినాడు . దీని వల్ల వీడు ఆ సెంటర్ లో ఎంతో ఫేమస్ పిల్లడు అయినాడు . వ్యా పారంలో వాడి నాన్న కన్నా, మిగతా అందరికన్నా వీడి అమ్మకమే ఎక్కువ అమ్మకం అయ్యింది . ఇహ నేను వాడికి చదువులో ప్రోత్సాహం ఇస్తూ తెలియని విషయాలు వివరించి చెపుతూ -హోము వర్కులు చేసి పెడుతూ వాడిని ఐదు నుండి టెన్త్ వరకూ అన్ని క్లాసుల్లు గట్టెక్కించాను . నేను ఫీజులకు డబ్బులు లేక ఇబ్బందులు పడేరోజుల్లో టప్పుడు వాడే నాకు డబ్బులు సర్దు బాటు చేసేవాడు .
వీడి తెలివిని గుర్తించిన గురవయ్య గారనే ఇడ్లీ బండి అయన వీడికి తన పిల్ల నిచ్చి పెళ్లి చేసి చిన్న హోటల్ తెరిపించాడు . ఇది నేను టెంత్ గట్టెక్కి కాలేజీలో చేరిన రోజుల్లో ను ,వాడు టెంత్ ధీమ్కి కొట్టి వాళ్ళ నాన్నతో మెచ్చుకోబడ్డరోజుల్లోనూ జరిగింది .
నేను కాలేజీవున్న విద్యలూ నేర్చి ఇహలోకంలోకి తిరిగి వచ్చేసరికి వాడు మావూరిలోనే అతి మంచి హోటల్కి అధిపతి అయినాడు . ఆతరువాత వాడు " "ఇడ్లీకా .. గోల్డ్ కాయిన్ స్కీం" పెట్టి హోటల్ని కొత్త పుంతలు తొక్కించాడు . ఆ స్కీము ప్రకారం మీరు తినే ఇడ్లీ మధ్యలో వున్నట్లుండి ఒక గ్రాము బంగారు కాయను తళుక్కున బయట పడుతుంది " ఇది నికార్సైన స్కీం కావటాన , ఇడ్లీ సగానికి విరిచి నపుడు కొందరికి , ముక్కలు చేసి సాంబారులో కి మిళితం చేస్తున్నప్పుడు కొందరికి చొప్పున , నెలకు ఫది మందికి పైగా గోల్డ్ కాయిన్స్ పొందారు .ఈ గోల్డ్ కాయిన్ స్కీము మూడొందల అర్వై అయిదు రోజులూ చాలూ లో ఉంటుంది . కానీ ఏ రోజున ఇడ్లీలో గోల్డ్ కాయిన్ దూరాపాలన్నది, ఎన్ని దూరాపాలన్నదీ అంత కూడా మా మిత్రడి పవర్ కింద ఉండేది . దీంతో ఆదివారాలు పూట , పొరుగు ఊర్ల నుండీ , పొరుగు జిల్లాల నుండీ వచ్చిన వారు కూడా హోటల్ ముందు క్యూ కట్టారు .వాడు క్రమంగా కోటీశ్వరుడైనాడు . నేను పెద్ద కంపెనీలో చిన్న టైపిస్ట్ అయినాను . ఇదీ చిన్న నాటి మిత్రుల కథ .
నీతి.. ఏమిటంటే .. తెలివి అనేది మొదట్లోనే ఉండాలి .. మధ్యలో రాదు
**a original by sree rama krishna varanasi of amaravathi**

**17- ఫలితం చూపని పాప కార్యం - 23-11-22**

అమ్మ గారూ నేను రేపు పనిలోకి రానండి " అంది రమణమ్మ

" ఎందుకో ? ఏమిటో ?అంటూ దీర్ఘాలు తీసింది భ్రమరాంబ .

" మా మనుమడు అదేదో విచిత్రంగా ప్రవర్తిస్తున్నాడమ్మా .. పదేళ్లు వచ్చినా గాని , మనిషి పక్కనలేక పోతే ఆటో ఎక్కడు. మనము వాడికన్నా ముందు గా ఆటో లో కూచ్చున్నా ఏడుస్తాడు . ముందుగా వాడినే ని ఆటో ఎక్కించినా ఏడుస్తాడు . చివరికి వాడిని చంకన వేసుకొని, ఆటోలో ఎక్కి వాడిని బళ్ళో దింపి రావాల్సి వస్తోందమ్మా . వీడి ఈడు పిల్ల లు వాళ్ళంతటట వాల్లే ఆటోలెక్కి బళ్లకు పోయొస్తున్నారు . వాడి వల్ల మాకు నలుగురిలో ఏదో చిన్నతనం గా ఉందమ్మా .."

" మరి ఇప్పు డేమిటట ? అడిగింది భ్రమరాంబ .

" అక్కడెక్కడో ఉండపల్లిలో - సన్యాసి గారున్నారంట . ఇల్లాంటి పిల్లలకి గ్రహపీడ , దుష్ట పీడా , తొలగి , అనవసర భయాలు పోవటానికి ఎదో రక్షా రేకు ఇస్తారంటా. అది తెచ్చుకుందామని పోతున్నాము "

"ఏదన్నా వైద్యుని దగ్గరకు పోక - మంత్రాలకు ఎందుకు పోతున్నారు ? ఇది ఎదో దుష్ట పీడా అని ఎందుకు అనుకుంటున్నా వే ? మీరంతాఅంతే " అంటూ నిరసన తెలిపింది భ్రమరాంబ .

" కాదులేమ్మా .. నా నమ్మకానికి మంచి కారణం వుంది . నా తమ్ముడు

ఆటో వేస్తాడు గదా .. ఒకసారి వాడి ఆటో లో మా అత్తని ఎక్కించి -ఆమెను ఇంకో వూరిలో ఎక్కడన్నా వదిలి పెట్టి రారా అని పురమాయించాను .వాడు ఆటోని అనేక పల్లెటూర్ల మీదగా తిప్పి తీసుకెళ్లి అదేదో పెద్ద వూరిలో ఆమెను వదిలేసి వచ్చాడు . కానీ మా అత్తా ఎట్లాగో నెలనాళ్ళకి ఇళ్ళకి తిరిగి వచ్చింది. అప్పడి నుండి ఆమె ఒంటరిగా ఆటో ఎక్కేది కాదు. దడిచి పోయేది . కొన్నాళ్ల తరువాత మా అత్తా నేను ఒక తిరునాళ్ళకు వెళ్ళాము . మా అత్తా నాచేతిని పట్టుకొని ఉంటే దాన్ని విడిపించుకొని, నేను ముందుగా ఆటోలో కూచున్నాను . మాతమ్ముడు ఆటోని ముందుకి దూకించాడు . అట్లాగా ఆమెని జాతరలో వదిలేసి వచ్చాము . కానీ ఎట్లాగో నెల రోజులతరువాత ఆమె తిరిగి ఇళ్లకు చేరింది .అప్పట్ల నుండి ఆమె తనను ఒంటరిగా ఆటో ఎక్కించితేను , తనతో వున్నవాళ్లు తన కన్నా ముందుగా ను ఆటో ఎక్కితే ఎంతో దడిచి పోయేది. చాల భయం పడేదీ .

ఆమె చని పోయినాక నే మాకీ పిల్లడు పుట్టిండు. ఆమె ఆత్మయే పిల్లాడిని ఆవరించింది అని . అందుకే పిలగాడు ఆటో ఎక్కటానికి దడుచుకుంటూ ఉన్నాడని సన్యాసి గారు చెప్పరామ్మా . నేను మా అత్తను వదిలించుకోవడానికి చేసిన ప్రయత్నాలు ఆయన కి ఎట్లా తెలిసిసాయో ? ఏమో?? . అయన మా అత్తా సంగతి పూసగుచ్చినట్లు చెప్పినాకనే, నాకు అయన మీద గొప్ప నమ్మకం కుదిరిందమ్మా " అందుకనే పిల్లాడికి దడుపు మంత్రం వేయించి రక్షా రేకు కట్టిస్తున్నానమ్మా " అంది పనిమనిషి ర మణమ్మ .

భ్రమరాంబ చాలా సేపు అలోచించి - " పదవే నీతో పాటు నేను కూడా వస్తాను . ఎనిమిదేళ్ల నా మనమడు కూడా ఎప్పుడూ ఎదో కోల్పోయినట్లు ఆకాశంలోకి చూస్తూ కూచొని ఉంటాడు రోగం.ఏమిటో చూపిద్దామని హాస్పిటల్కి తీసుకు వెడితే ..చాలు , ఆ హాస్పిటల్ని - ఆ డాక్టర్ లని చూడగానే ఎంతో మామూలు పిల్లాడిలా మారి పోతాడు . డాక్టర్ లేమో ఏ జబ్బు లేదంటారు . పిల్లాడిని ఇంటికి తేగానే మళ్ళా వెళ్లి ఒక కుర్చీలో కూచుని , ఎదో పోగొట్టుకున్నట్లు సూన్యంలోకి చూస్తూ కన్నీళ్లు పెట్టుకుంటాడు . వాడిని చూసి మా గుండెలు ఘోషిస్తూ వున్నాయి . మా

అత్తా బ్రతికున్న రోజుల్లో తన్ను హాస్పిటల్లో చూపించమని డాక్టర్కి చెప్పి మందులు ఇప్పించమనికన్నీళ్లు పెట్టుకుంటూ ఉండేది . " కానీ నేను " నీది తగ్గే జబ్బు కాదు - కాటికి చేర్చే జబ్బు " అని ఆమెను విసుక్కోని , ఆమెను మంచం నుండి లేపి బాల్కనీ లోని ఓ కుర్చీలో కూలేసే దాన్ని . ఆమె ఆరోగ్యం గురించి ఏమీ పట్టించుకోలేదు .దానితో ఆమె వైరాగ్యంగా ఆకాశంలోకి చూస్తూ కన్నీళ్లు కారుస్తూ ఉండేది . ఆమె చని పోయినాకే నా కొడుక్కి కొడుకు పుట్టాడు . వాడు ఇప్పుడిట్లా చేస్తున్నాడు . నువ్వు చెప్పినదాన్ని పట్టి చూస్తే మా అత్తగారు మా మానమడిని పూని నట్లుంది . నేనుకూడా వాడికోసం ఒక రక్షా రేకు తెచ్చుకుంటాను . నేను గూడ రేపు నీతో వస్తాను "

--------------------------------------------------------------------

నేను ఏదన్న రాయగానే దీని ద్వారా మీరు ఏమి చెప్పదలచుకున్నారు ? అని విమర్శనా పూర్వకంగా చాలా మంది అడుగుతుంటారు . నేను చెప్పేది ఏమంటే పైదంతా నమ్మవద్దు. . కానీ పెద్దలను నిర్లక్ష్య దృష్టితో చూడవద్దు . ఫలితం చూపని పాప కార్యం అనేది ఉండదు.

**-------. A ORIGINAL BY VARANASI SREE RAMA KRISHNA OF AMARAVATHI -------------------------**

## 18.పిచ్చి ధర్మరాజు 1-12-22

మహాభారతం అనేది మనకాలం లో జరిగితే మనము ఎవరి పక్షమో ఒకరి పక్షము ఉండేది తప్పని సరి అయివుండేది . e పల్లెటూరి కథలో . ధర్మయ్య అని , ఒక మోతుబరి రైతు ఉంటాడు . అతనికి అరవై డెబ్బై ఎకరాల కమతం వుంది . అతన్ని ఆ ఊరి వారు అందరూ పిచ్చి ధర్మరాజు అని పిలుచుకుంటారు . పిచ్చి అనే బిరుదుకు అర్థం ఏమంటే, ఒక్క మాటతోనో ఒక్క అబద్ధముతోనో లౌక్యంగా పరిష్కరించుకోవాలిసిన లౌకిక విషయాలను - మరీ ధర్మ బద్ధంగా పరిష్కరించుకొ చూసేవాడు అని . నిజానికి పిచ్చి ధర్మరాజు అంటే ఎంతో ఉదారుడు, అని, ఒక పల్లెటూరి పొగడ్త .

ఒక పంట సంవత్సర కాలములో - ధర్మయ్య పొలానికి కుడివైపున వున్నా

దుర్గమ్మ అనే ఆవిడ పొలానికి వారసుడైన ఆమె ఒక్కగానొక్క కొడుకు - గోవిందం అనేవాడు - ధర్మయ్య గారి పొలంలో కి ఒక అరెకరం పైగా కబ్జాచేస్తూ పొలం దున్ని పంట వేసుకున్నాడు . పిచ్చి ధర్మయ్య చోద్యం చూస్తూ ఊరుకున్నాడు .

మరుసటి పంట సంవత్సర కాలములో - ధర్మయ్య పొలానికి ఎడమ వైపున వున్న సుబ్బులు అనే ఆవిడ పొలానికి వారసుడైన ఆమె ఒక్కగానొక్క కొడుకు - జగ్గన్న అనేవాడు - ధర్మయ్య గారి పొలంలో కి ఒక ముప్పాతిక ఎకరం పైగా కబ్జాచేస్తూ పొలం దున్ని పంట వేసుకున్నాడు . ఇప్పుడు కూడా పిచ్చి ధర్మయ్య చోద్యం చూస్తూ ఊరుకున్నాడు .

ఇంకో పంట సంవత్సర కాలములో - ధర్మయ్య పొలానికి వెనుక హద్దుగా వున్న పార్వతమ్మ అనే ఆవిడ పొలానికి వారసుడైన ఆమె ఒక్కగానొక్క కొడుకు - రామన్న అనేవాడు - ధర్మయ్య గారి పొలంలో కి ఒక పావు ఎకరం పైగా కబ్జాచేస్తూ పొలం దున్ని పంట వేసుకున్నాడు .
ఇప్పుడు కూడా పిచ్చి ధర్మయ్య చోద్యం చూస్తూ ఊరుకున్నాడు అనుకునేరు . కాదు అయన రామన్నతో లొల్లి పెట్టుకున్నాడు .
ధర్మన్న- రామన్న హోరాహోరీ పోట్లాడుకున్నారు . మాటా మాట అనుకున్నారు .పొలం గట్ల మీద వున్నా మిగతా రైతులు ఇద్దరి చుట్టూ చేరారు . " ఎంతైనా నువ్వు ధర్మాత్ముడివి కావు . నేనంటే పక్షపాతం చూపిస్తున్నావు " అంటూ ధర్మన్నను నిందించిన రామన్న వెళ్లి పోయాడు .
" అవును- ధర్మన్న ధర్మంగా ప్రవర్తించటం లేదు - పక్షపాతం చూపిస్తూ వున్నాడు . కుడి వైపునుండి ఒక అరెకరం ఎడమవైపునుండి ఇంకో ముప్పాతిక ఎకరాన్ని ఆక్రమించుకున్న వాళ్ళని వదిలేసి - వెనకనుండి వచ్చి కేవలం ఒక పావు ఎకరం ఆక్రమించుకున్న వాడితో ఈ పోట్లాట ఏమిటి ? అని చర్చించుకుంటూ మిగతా రైతులు వెళ్లిపోయారు .

ఏది ఏమైతే నేమి విషయం గ్రామపు రచ్చబండమీదకి చేరింది .

"ఆయనకు నేనంటే పక్షపాతం" అని తిరిగి ఆరోపించాడు పావు ఎకరం మాత్రమే అక్రమించుకున్న రామన్న .

మళ్ళీ మళ్ళీ వస్తున్నా ఈ ఆరోపణకు ధర్మయ్య నొచ్చుకొని " నేను ధర్మం తప్పే మనిషిని కాదు. నాకు ఎవరి మీద పక్షపాతం లేదు. . ముగ్గురూ తలా ఒక ఎకరం చొప్పున ఆక్రమించుకోండి " అని పెద్దమనుషుల సాక్షిగా మాట చెప్పాడు .

ఇప్పుడేమి చేయాలో పాలు పోక " ఆలా చేసుకోండి పోండి " అని చెప్పి పెద్దమనుషులు వెళ్లిపోయారు .

పిచ్చి ధర్మయ్య గారికి ఊరిలోనే ఈశ్వరయ్య గారుఅనే ఒక బామ్మరిది వున్నాడు . ఈ అయన అక్కగారినే ధర్మయ్య పెండ్లాడాడు . ఆమె ఒక మొగ పిల్లాడిని కని పురిటి లోనే మరణించింది . ఆ పిల్లాడిని తానె పెంచుతూ , అతడినే అల్లుడిగా చేసుకోవాలని ఆలోచనతో వున్నాడు ఈశ్వరయ్య .
రచ్చ బండ దెగ్గిర పంచాయతీ జరిగిన రోజున ఈశ్వరయ్య వూరిలో లేడు. వచ్చి విషయము విని " మాబావ పిచ్చి ధర్మరాజు అనుకున్నాడు " అనుకునేరు .

కాదు ఆయన డీప్ గా అలోచించి పట్నంలో వున్నా ధర్మయ్య కొడుకుని పిలిపించాడు . ఇతడు ఐ ఏ స్ అయి పట్నంలో సబ్ కలెక్టర్గా వున్నాడు . అతడు వస్తూ వస్తూ తన అనుంగు మిత్రుడైన ఒక డీ ఎస్ పీ నీ వెంటబెట్టుకొని - పోలీసు కారులో సైరెన్ మోగిస్తూ ఊళ్లోకి వచ్చాడు .
" ఏంటి మామ విషయం ? అని ఈశ్వరయ్యను అడిగాడు . ఈ స్వరయ్య నవ్వి " నేనేమన్నా చెబితే - నాపిల్ల మేలుకోసమని నేను నీకేదో విషం నూరి పోశానని అందరూ , అనుకోవచ్చు . కాబట్టి వూర్లో తిరిగి విషయం ఎంక్వయిరీ చేసుకొని- పొలం కట్టడి చేసుకో - అని చెప్పాడు .

పిల్ల కలెక్టర్ గారు ఊరంతా తిరిగి పెద్దలందరినీ విచారణీ చేసాడు .

ఆ విచారణలో తేలింది ఇది . <>ధర్మయ్యకి చిన్న వయసులోనే భార్యపోవటంతో - అయన పొలానికి కుడివైపున వున్నా దుర్గమ్మ అనే ఆవిడా తో సరసం చేసి ఆమెకో కొడుకును ఇచ్చాడు

ఇలాగేఎందుకైనా పనికొస్తాదని ఆయన పొలానికి ఎడమ వైపున వున్న సుబ్బులు అనే ఆవిడ ధర్మయ్య ఆలనా పాలనా చూసి తలంట్లు పోసి చివరికి ఒక కొడుకును పుచ్చుకుంది .
నేనేమి తక్కువ అన్నట్లు , ధర్మయ్య పొలానికి వెనుక హద్దుగా వున్నా వున్న పార్వతమ్మ అనే ఆవిడ కూడా ధర్మయ్యకి రాత్రి పూట పళ్ళు పాలు పరోటాలు చపాతీలు అమర్చి పెట్టి , చివర్లో పండంటి మొగపిల్లాడిని కంది .
ఈ ముగ్గురు ఆడవాళ్ళ పోరు పడలేక వాళ్ళ మొగుళ్ళు వాళ్ళని వదిలేసి రంగం పోయినాకనే ఈ బిడ్డలు పుట్టారు .
ధర్మయ్యకున్న ఈ కేబుల్ కనెక్షన్స్ ఎవ్వరికో తప్ప తెలీవు .పిల్లకాయల్ని కన్నతల్లులకు వయసు మీద పడి- లోకం బెరుకు వదిలి - కొడుకుల మీద ప్రేమ పెరిగి, వారిని స్థితి మంతులను చేయాలన్న ఆలోచన బలమైన పిమ్మట లో - కొడుకులకు ధర్మరాజునుండి కొంత ఆస్తులు చిక్కించాలని భావించి - తమకు పుత్ర దానం చేసిన పిచ్చి ధర్మ రాజుగారిని చూపి "అదిగో మీ అయ్య " అంటూ కొడుకుల కు పరిచయం చేశారు . తల్లే చెప్పినాక కాదనేముంది అని . కొడుకులుకూడ మేము అయన ఏ తమ తండ్రి అని మనస్సులో సమాధాన పడ్డారు.

అందువల్ల ముగ్గురిలో మొదటి వాడైనా గోవిందం అనేవాడు - " నా తండ్రి ఆస్తి నేను ఆక్రమించుకుంటే తప్పేమిటి ?" అని మనసులో తర్కించుకొని - ఒక అరఎకరా పొలం - ధర్మయ్య పొలం నుండి కబ్జా చేసాడు . ఇది చూసి రెండో వాడైనా జగ్గన్న - ధర్మయ్య గారి పొలంలో నుండి ఒక ముప్పాతిక ఎకరం పైగా కబ్జాచేశాడు . ఈ రెండూ చూసి రామన్న అనే మూడవ వాడు - ధర్మయ్య పొలంలో ఒక పావు ఎకరం పైగా కబ్జాచేస్తూ పొలం దున్నాడు . కానీ ధర్మయ్య దెగ్గరనుండీ లొల్లి ఎదుర్కున్నాడు . ఈ నేపథ్యంలోనే

అతడు " " నేనంటే నీకెందుకింత పక్ష పాతము? అని ధర్మయ్యను అడిగాడు .తమకు జన్మ నిచ్చిన తండ్రి అయినా ధర్మయ్య నుండీ కొద్దీ కొద్దిగా పొలం గుంజుకుందామని ఆయన ఇంటిపేరు లేని ఆయన కొడుకులు ప్రయత్నించారు .

" ఇదీ న్యాయంగానే వుంది . నేను ధర్మము తప్పను -నాకు ఎవరిపట్లా పక్షపాతం లేదు అందరూ "తలా ఒక ఎకరం ఆక్రమించుకోండి అంతటితో అంతా ఫైనలు " అన్నట్లు ధర్మరాజుగారు రచ్చబండ మీద మీద ప్రకటించటంలోని ఉద్దేశ్యము అని చిన్న కలెక్టర్ గారి విచారణలో తేలింది .అయన పోలీసు లను వుపయోగించి తన మారుటి తమ్ములందరికీ తల ఓ వందగజాల భూమిని ఇచ్చి మిగతా ఆక్రమణ అంతా వెనక్కి నెట్టించాడు .

ఆనాటి నుండీ భారత యుద్ధము ప్రారంభం అయ్యింది ." మాకూ ధర్మయ్య గారి పొలం లో సమ వాటా వుంది - మా డీ యెన్ ఏ అయన డీ యెన్ ఏ టెస్టు చేపించండి " అని " ముందుగా మా అనుభవంలో వున్న భూములు మా స్వాధీనంలో ఉండేటట్లు స్టే ఇప్పించండి అని ఈ ముగ్గురూ కోర్టులకు ఎక్కారు ..

న్యాయ పోరాటం మొదలైంది .

మన పిచ్చి ధర్మరాజు " నేను ధర్మము తప్పే మనిషిని కాదు నాకెవరిమీద పక్షపాతం లేదు అని రచ్చబండ మీద పలకటం నేడు మరో మహా భారతానికి తెరతీసింది . ఇప్పుడు మీరు ఏటో ఒక వైపు ఉండక తప్పదు . ఎటున్నారో? ఏటో ఏమనుకుంటున్నారో ?ఏటో ?చెప్పండ్రి .న్యాయం రెండు పక్షాల వున్నప్పుడే కోర్టు యుద్ధాలు వస్తాయి

**a original by varanasi sree rama krishna of amaravathi**

19. బొగ్గుల పిల్లా - భయంకర దొంగలు . 29-11-22

దొంగతనాలు భయంకరంగా చేస్తూ , అంటే జనాన్ని గాయ పరిచి వారికి భయం పుట్టించి దోచుకొనే దొంగలు కొందరు , చూపులకే భయంకొలేవ్వలా ఉండి వాళ్ళు అడక్కుండానే మనమే మన డబ్బులు వాళ్లకి ఇచ్చేట్లు

చేసుకునే దొంగలు కొందరూ వుంటారు .ఈ రొండో రకం దొంగలే మన భయంకరమైన దొంగలు గా వున్నారు .
మన దొంజలు చూపులకు భయం కొలిపే భయంకర ఆకారాలలో ఉండి- తమను చూస్తూనే జనం జడుసుకొని చిచ్చు పోసుకుండేట్లు చేసి - దారి దోపిడీ చేసే దొంగలు .వీళ్ళు ఒక అరణ్యంలో మకాం వేసి వుండే వారు . వీళ్ళ నాయకుడి పేరు శుభంకర్. ఈ దొంగలు మొత్తం ఇరవై ఇద్దరు . ప్రతి ఒక్కడి లోనూ ఎదో ఒక భయం కోల్పే విషయం ఉంటుంది . ప్రతి ఒక్కడి చేతిలో నిలువెత్తు ఖడ్గం ఉంటుంది . ప్రతి వాడి మేడలో ఎముకల హారమో నడుముకు చిన్న పుర్రెల హారమో ఉంటుంది . శుభంకర్ గాడికి కైతే పెద్ధ అడవి దున్న యొక్క పుర్రె కొమ్ములతో సహా .. నెత్తి మీద ఒక కిరీటం లాగ ఉంటుంది. వాడు పట్టు కున్న చేతి కర్రకు ఒక ఆరు అడుగుల నల్ల తాచుపాము బ్రతికి వున్నదే - కర్రకు తాడుకట్టినట్లు కట్టి ఉంటుంది . శుభంకర్ గాడు ఒక్క వీల వేయగానే ఆ పాము చట్టుక్కున నిద్ర లోనుండి మేల్కొన్నట్లు మేల్కొని . గాలిలో ఆడుతూ బుసలు కొడుతూంది .ఈ పాము విన్యాసం శుభంకర్ గాడి వల్ల ఎల్లా సాధ్యము అయింది అంటే ??
శుభంకర్ గాడి దెగ్గర ఒక ముసలి ఫకీరు ఒకడు బందీ గా వున్నాడు . ఈ పకీరుకు ఏవో కొన్ని శెక్తులు వున్నవి . మంత్ర విద్యలు తెలుసును . ఈ ఫకీరు తన శెక్తులు వుపయోగించి - అరణ్య మార్గం ద్వారా నడిచి వస్తున్నా ప్రయాణికుల ముందు - వున్నట్లుండి పొగలు మంటలూ సృష్టించీ , ఆకాశం లోనుండి - మసి , పసుపు నీళ్లు, కుంకపు నీళ్లు కురిపించి , ఓ కొబ్బరికాయ ఓ గుమ్మడి కాయ గాలిలో తేలుతూ వచ్చి - ప్రయాణీకుల కళ్ళకు జాన దూరం ముందు ఠప్పున పేలిపోయేట్లు చేసీ ..కర్పూరం గుప్పున వెలిగి , గాలిలో గింగులు కొట్టేటట్లు చేసి ప్రయాణీకులను హడలెత్తించటం వంటివి చేస్తూ ... ఈ ఫకీరు శుభంకర్ గాడికి భలే సహాయకుడిగా వుండే వాడు .ఈ ఫకీర్ ఏ , తన మంత్ర సెక్తితో పామును కర్రకు అతికించి . అది శుభంకర్ గాడి వీలకుతగ్గట్లు అదేవిధముగా చేసాడు .
" నాకు ఒక అమ్మాయిని చూసి పెళ్లి చేయి - నిన్ను విడిచి పుచ్చుతాను " అని శుభంకర్ పకీరుతో అంటూ ఉండేవాడు .
ఒకనాడు ఈ దొంగల ముఠా సరదా చేసుకుంటూ అరణ్యములో నడుస్తున్నది . అపుడు ఫకీరు కళ్ళు మూసి తెరిచి ఎదో చూసినట్లు ఈ రాత్రికి ఇక్కడ ఈ మర్రి చెట్టు కింద మకాము వేద్దాము " అన్నాడు . ఈపాటికి దొంగలు అందరూ మంచి ఆకలితో వున్నారు . వాళ్ల దెగ్గర

బియ్యము కూరలు ఉప్పూ పప్పూ అన్నీ వున్నాయి . కానీ వండిపెట్టే ఆడదే లేదు . వాళ్ళు ఎండిన కట్టెపుల్లలు పోగేసి వంట పాత్రలు బయటికి తీశారు . అప్పుడు ఫకీరు తన చేతిని మర్రి చెట్టు తొర్రలోనికి జొనిపి ఒక అమ్మాయిని బయటికి లాగాడు . ఆ అమ్మాయి ఎదో మంత్రానికి కట్టు బడినట్లు నట్లు సులువుగా చెట్టుతొర్రలోనుండి ఒక్క గంతులో బయటికి వచ్చేసి నుంచుంది .
ఈ అమ్మాయి ఎంతో అసహ్యంగా ఒంటిమీద బెత్తెడు మందము మురికి తో వుంది . రొండు బుగ్గలు జామకాయల్లా ఉబ్బి ఉండి , బుగ్గల్లోనుండి రక్తం కారుతున్నది
కంటిరెప్పలపై వేపకాయలంత పులిపిర్లు వున్నాయి . కాళ్ళు చేతులు పై అనేకమైన కాలిన నల్లని మచ్చలు , కొర్రులు కాల్చిన గాయపు పుండ్లు ఉండి, అవి చీము కారుతున్నాయి . చేతి వేళ్ళు , నల్ల బొగ్గుల్లా వున్నాయి . కాళ్ళు మోకాళ్లవరకు సగం కాలిన కట్టెలలా వున్నాయి .
మీరు అనుకున్నట్లు - ఈ పిల్ల ఫకీరు మంత్ర సృష్టి కాదు . నిజమైన ఆడ పిల్లనే . కట్టెలకోసం అని అరణ్యానికి వచ్చి , దొంగలు వస్తున్న సవ్వడి విని మర్రి చెట్టు తొర్రలో దాక్కున్నది . ఈ పిల్లకి వూరిలో వున్న పేరు బొగ్గుల పిల్ల అని . . ఈ పిల్లకు తాగుబోతు తండ్రి , సవతి తల్లి తప్ప ఇంకా ఎవరూ లేరు . ఆమె ఈ పిలను పెట్టె కస్టాలు అనేకం . ఈ పిల్ల ఉదయాన్నే అరణ్యానికి వచ్చి ఎండు కట్టెలు ఏరి .. వాటిని మండించి బొగ్గులుగా మార్చి - ఊరులో ఇంటింటికీ తిరిగి అమ్ముతూ ఉంటుంది . ఆ వచ్చిన డబ్బును ఈ పిల్ల తన సవతి తల్లికి ఇవ్వాలి . ఆ సవతి తల్లి ఆ డబ్బు తన అలంకారానికి, విలాసానికి . తిండికి వాడుకొని - ఈ పిల్లకు మాత్రం రోజూ ఇంత గంజి పోస్తుంది. ఆమె కావాలనే పిల్లను శుభ్రంగా కనపడనివ్వదు . పిల్ల శుభ్రంగా ఉంటే ఎవరన్నా వచ్చి పెళ్లాడుతాము అంటారేమో అని ఆ సవతి తల్లికి భయము .
రోజూ నిప్పు రగిల్చి ఎందుకట్టెలను బొగ్గుగా మార్చటం అనే పని వల్ల , ఆ నిప్పు వేడి వల్లా ఈ పిల్ల సేరీరం అంతా నల్ల కప్పు వేసి పోయి, సరైన పోషణ, శుభ్రత లేక వాళ్లంతా పుండ్లు పడిఇప్పుడున్నట్లు వికారంగా తయారు అయ్యింది .
" ఈ పిల్లను నేను పెండ్లాడుతాను .. . నాకు నచ్చింది . దొంగతనాల్లో అందరీన్నీ భయ పెట్టటానికి నాకు చేదోడు వాదోడు గా వుంటాది " అని దొంగల నాయకుడు శుభంకార్ గాడు చంకలు గ్రుద్దు కున్నాడు .
" మంచి ముహూర్తం చూసి మీ పెళ్లి జరిపిస్తాను .. ఇప్పటికి ఈ అమ్మాయిచేత వంట చేయిస్తాను " అంటూ ఫకీరు బొగ్గుల పిల్లకు

వంటపని పురమాయించాడు . ఎప్పుడూ నిప్పులతో సావాసం చేసే పిల్ల కాబట్టి ఈ బొగ్గుల పిల్ల , కట్టెలన్నీ చక్కగా పేర్చి - మంటలను సరి చేస్తూ నిప్పురవ్వలు గాలిలోకి లేచి మీద పడుతున్నా లెక్కచేయకుండా వంట పాత్రలను మంట చుట్టూ చేర్చి రకరకాల వంటలు వండింది .దొంగల్లో ఎవడో ఒకడు జోలెలో వున్న దొంగ కోళ్లను బయటకి తీయగా - వాటిని పెట్టి చికెన్ బిర్యానీ కూడా ఒండింది . అది తిని దొంగలందారూ ఈ పిల్లకి జై కొట్టి - ఆమె తమ దొంగలకు నాయకీ రాణీ అవ్వవలసినదే అని అరిచారు .
ఆ రకంగా ఆ బొగ్గు పిల్లను శుభంకర్ గాడు పెళ్లాడటం నిర్ణయం అయిపోయింది . అప్పుడు బొగ్గు పిల్ల తరఫున ఫకీరు కలిపించుకోని " నేటికీ మూడు రోజుల అవతల సూర్యగ్రహణం చీకట్లో మీ పెళ్ళికి చక్కని ముహూర్తం ఉంది. ఇప్పుడు మీరు ఆమె తన వంట పని తనంచూపి మనలను అందరీని సంతోష పరిచింది . కాబట్టి మనము మనదెగ్గరవున్న విలువైన వజ్రాల హారంతోఅలంకరించి ఆమెను అలంకరిద్దాము . ఆమె సంతోషిస్తుంది. .కానీ ఇప్పటికి అయితే ఆమెను తిరిగి ఇంటికి పంపించుదాము . ఆమె మన నాయకుడికి పెళ్లాడినాక తిరిగి ఆమె పుట్టింటి వారిని , తన ఊరిని చూసే అవకాశం కలగదు కదా ? అందువల్ల మన నాయకీ రాణి తన పుట్టింటికి వెళ్లి అందరికి వీడ్కోలు చెప్పి వచ్చే అవకాశం ఇద్దాము ఏమంటారు ? " అని అన్నాడు . మిగతా దొంగలందరూ బొజ్జలు నిమురుకుంటూ" అవును అవును అలాగా చేద్దాం - అదే ధర్మమూ " అన్నారు.
కానీ శుభంకర్ గాడు మాత్రం " ఈ పిల్ల మళ్ళా తిరిగి వస్తుందని నమ్మకం ఏమిటి ? అని ప్రశ్నించాడు .
అప్పుడు ఫకీరు " అలాంటిది జరగకుండా నేను ఆమె వంటికి ఒక భస్మం రాస్తాను .ముహూర్తం వేళ్ళకి తిరిగి రావటానికి ఆమె వెనుకంజ వేస్తే - ఈ భస్మ ప్రభావంతో ఆమె శరీరం అంతటా దురదలూ మంటలు లేచి - అవి తట్టుకోలేక ఎక్కడవున్నా ఇక్కడికి పరిగెత్తుకు వస్తుంది " అని చెప్పాడు . దొంగలు, బొగ్గుల పిల్లని వజ్రాల హారంతో అలంకరించి నాకనూ , ఫకీరు ఆమె వళ్ళంతా దట్టంగా మంత్రపు భస్మము చల్లి నాకనూ , ఆమెను ఇంటి కి పంపించి వేశారు .
బొగ్గుల పిల్ల దక్కిన వజ్రాల హరమ్ వెనుక చిన్న విషయం ఉంది . ఆ ప్రాంతపు రాజు గారు ఒక కంసాలి కి ఒక హరమ్ తయారు చేయమని పురమాయించి అతనికి కొంత బంగారము కొన్ని వాజ్రాలు ఇచ్చాడు .

హారంతయారు కాగానే దాన్ని తీసుకొని కంసాలి రాజు దెగ్గరికి బయలు దేరాడు . అనుకోకుండా మన శుభంకర్ గాడు ఆ హారాన్ని దోచాడు .
బొగ్గు పిల్ల ఇంటికి చేరగానే సవతి తల్లి ఆ హారాన్ని కబ్జా చేసి తాను అలంకరించుకొని ఊరంతా చెక్కెర్లు కొట్టి బడాయిలు పోయింది . ఈ రకంగా తిరగటంలోని ప్రమాదాన్ని - అత్యుత్సాహంలో వున్న ఆమె తెలుసుకోలేక పోయింది . ఒక పల్లెటూరిలో ఒక స్త్రీ వజ్రాల హరమ్ ధరించి తిరుగుతున్నా దన్న వార్త వేగుల ద్వారా రాజుకు చేరింది . కంసాలిని పిలిపించి దూరమునుండి సవతి తల్లి మేడలో వున్న హారాన్ని గుర్తు పట్టించారు .
కానీ అసలు దొంగను పట్టుకోవాలన్న ఉద్దేశ్యంతోరాజుగారు ఆ హరమ్ స్వాధీనం చేసుకోలేదు .
బొగ్గు పిలను దొంగ కిచ్చి పెళ్లి చేస్తే , తనకు అప్పుడప్పుడూ ఇలాంటి హారాలు దక్కుతాయన్న ఆలోచనతో - ఆ సవతి తల్లి పెళ్లి ఎప్పుడెప్పుడా అని ఆలోచిస్తూ - అముచ్చట్లను నలుగురితోనూ చెప్పింది . విషయము అంతా తెలుసుకున్న రాజుగారు మారు వేషము వేసుకోవచ్చి - బొగ్గుపిల్లను అనుసరిస్తూ వెళ్లి అసలు దొంగను పట్టుకోవాలని ఫథకం వేసాడు .
ముహూర్తం వేళా సమీపిస్తూ వున్న కొద్దీ బొగ్గు పిల్ల వంటిలో దురదలూ మంటలూ లేచాయి . ఆమె కాళ్ళు వాటంతట అవియే అరణ్యంలోకి - దొంగల రహస్య స్థావరం వైపుకి దారి తీశాయి .
వళ్ళు బరుక్కుంటూ వచ్చిన బొగ్గు పిల్లను- ఆమెను చాటుగా అనుసరిస్తున్న రాజుగారిని ఫకీరు చూసాడు . అంతా నేను అనుకున్నట్లే జరుగుతున్నదీ అనుకున్నాడు . ఫకీరు అనుకున్నది ఏమిటంటే ? వజ్రాల హరమ్ జాడను రాజుకు తెలిసేట్లు చేసి - అయన వచ్చి దొంగలను ప ట్టుకున్నాక - తాను వారినుండి విముక్తి పొంది అడవిలోపలికి తపస్సుకు
పోవాలని. అస్సలు నిజం మాట్లాడితే ఫకీరు ఇంతకాలం దొంగల దెగ్గర బందీగా వున్నది ఎందుకంటే దొంగలందరినీ రాజుకు పట్టించి ప్రజలకు మేలు చేద్దామని .. అరణ్యములో ప్రశాంతతత నెలకొల్పు దామనీను .
ఫకీరు బొగ్గు పిల్లను పొయ్యి అక్కడనే వున్న కోనేటిలో స్నానం చేసి రమ్మన్నాడు . శుభంకార్ గాడు మిగతా దొంగలు , పెళ్లి వేడుక కోసం అని తాగి , ఆ తాగి న మత్తులో చుట్టూ పక్కల ఏమి జరుగుతున్నది గ్రహించలేదు . దొంగలందరూ ఒక్క గుత్త గా రాజు చేతిలో బందీ అయినారు . రాజు చుట్టూ పరిశీలనగా చూసే సరికి - కోనేటిలోకి దిగిన

బొగ్గు పిల్ల బంగారు బొమ్మలా మారి బయటికి వచ్చింది . సన్యాసి రాసిన భస్మము వల్ల ఆమె వంటిమీద పుండ్లు అన్నీ పోయి బంగారు రంగులోకి వచ్చింది .ఆమె సహజ సౌందర్యం బహిర్గతం అయ్యింది . ఆమె మెడలోని వున్న తన వజ్రాల హారాన్ని చూసి ఆమెఎవరో దేవకన్య కాదని తన బొగ్గుల పిల్ల ఏ అని గుర్తు పట్టేడు రాజుగారు .ఇంకేముంది ఆమెను అంగరంగ వైభవంగా పెళ్ళాడి తన రాణిని చేసుకున్నాడు .
ఇంతకీ మన మంచి ఫకీరు ఏమయ్యాడన్నదీ ఎవరికీ తెలియలేదు . కానీ ఎవరేనా తల బాగా పైకెత్తి చూస్తే తెలిసేపోయేది . ఫకీరు ఒక చెట్టుకొమ్మ చిటారున నిలబడి - అప్పుడే గ్రహణం వీడుతున్న సూర్యునికి నమస్కరిస్తూ వున్నాడు . ఆ తరువాత అతడు ఏమి అయ్యాడు ఇంకా ఇల్లాంటి హెల్పులు చేశాడు అన్నది ఇంకో సారి తెలుసుకుందుము .
ఇట్లాంటప్పుడు " తదుపరి కార్యం దరిమిలా ఆలోచిద్దాం అని మా తండ్రి గారు అయినా వారణాసి లక్ష్మీ నరసింహయ్య గారు అంటుండేవారు .
ఇది వారణాసి శ్రీ రామ కృష్ణ అనే నాచే సొంతంగా రాయబడి - మాతండ్రి గారికి నివాళిగా అర్పించ బడిన కల్పిత కథ . తండ్రిని మించిన వేరు దైవము ఉండదు - అని పెద్దలు పిల్లలు అందరూ గ్రహించాలి అని నేను కోరుకుంటూ - వుండాను . ఇది- అంటే ఈ కథ పిల్లలకూ , పిల్లలనుండి పెద్దలుగా మారి - తిరిగి పిల్లలుగా మారిన పెద్దలందరికీ నచ్చలన్న ఉద్దేశ్యంతో రాసాను . ఇంగిలీషు వారి ప్రకారం " తండ్రి చని పోయిన పిమ్మటకానీ అతని విలువ తెలియదు " అనగా తండ్రి బ్రతికి ఉండగా అతని విలువ అర్ధంకాదని - చెప్పారని కూడా అనుకోవచ్చు

## 20. రన్ బేబీ రన్ 2-12-22

రన్ బేబీ రన్ అని మేము గట్టిగా అరిచాము .
ఎక్కడ అరిచాము అంటే మనస్సులో అరిచాము .
మేము ఎవరమూ అంటే ఖాళీ సమయం ఎక్కువై - కృష్ణా నది తీరం వెంటవున్నా స్నానాల ఘాట్ మెట్ల మీద కూర్చున్న వాళ్ళము .
ఎవరిని చూసి అరిచాము ? అంటే .. పోలీస్ ఉద్యోగాలకోసమో , హోమ్ గార్డ్ ఉద్యోగాలకోసమో అప్లై చేసి , కృష్ణా నది ఇసుకలో పరుగు ప్రాక్టీస్ చేస్తున్న - నవయవ్వనం లో వున్నా ఆడపిల్లలని ఉద్దేశించి రన్ బేబీ రన్ అని అరిచాం .
అలిసి చెమటలు కక్కుతున్న వంటితో, ఎగ ఊపిరితో ఎగిసి పడుతున్న

వాళ్ళ అందాన్ని చూసి - మన తరఫునుండి వాళ్ళకేదన్న ఎంకరేజ్మెంట్ ఇవ్వకపోతే దేముడు మనను క్షమించడు అనే ఉద్దేశ్యంతో అరిచామే కానీ వేరే దురుద్దేశ్యం ఏమీ లేదు .

ఈ పరుగు పందెపు ప్రాక్టీస్ ఒక నెల దినాల పైగా జరుగు తున్నది . మాతో పాటు ఒక స్త్రీ కూడా కూర్చొని ఉండేది . ఆమె ఎవరంటే - మీ కారు లేదా బైకు ట్రాఫిక్ లైట్ సెంటర్లో ఆగినప్పుడు , మీ వెంటపడి అది కొనండి ఇది కొనండి అని అడుగు తాబు చూసారు .. అలాంటి వర్గానికి చెందిన మనిషి .ఇప్పుడు కూడా కొన్ని సమోసాలు స్టీల్ బకెట్ లో పెట్టుకొని వచ్చి అమ్మకం చేస్తూ ఉంది .

ఆమె జీవన విధానము , బ్రతికే విధానము , ఆచార వ్యవహారాలు తెలుసు కునేందుకు అని నేను ఆమెతో మాటలు కలుపుతూ ఉండేవాడిని . చివరికి ఆమె నన్ను భయ్యాజీ అని పిలిచి తన పేరు షేరా అని చెప్పింది . ఈమె కుమార్తెను కూడా ఈ పరుగు ప్రాక్టీస్లో వుంది . తన కూతుర్ని ఎంకరేజ్ చేయటానికి అన్నట్లు షేరా చేతులు ఊపుతూ " అచ్చా భేటీ ..దౌడో . ఔర్ దౌడో " అని పిలుపు ఇస్తూ ఉండేది .
ఒక రోజు నేనే ఇ " ఏమమ్మా .. మీరు ఇక్కడ నాన్ లోకల్ అవుతారేమో .. మీ అమ్మాయికి పోలీస్ వుద్యోగం ఇస్తారో ఇవ్వరో .. ఆలోచించావా ? అని అడిగాను

ఆమె ఏమన్నదంటే " మేము దేశదిమ్మరులం . మాకులం లో , మా తెగ మొగ వాళ్ళతోనే తప్ప వేరే వాళ్ళతో పెళ్లిళ్లు చేసుకోము .
మామొగవారందరూ బడా తాగుబోతులు . తాగిన తరువాత పెళ్లానీన్ని, పిల్లలని చితక తన్నుతుంటారు . అక్కడికీ తిక్క తీరక పోతే .. ఆడదాని చేతిలో వున్నా బిడ్డను లాక్కుని ఎక్కడికో పారిపోతుంటారు . ఆ రకంగా ఆడదానికి గుండెకోత తెచ్చిపెట్టి- పెళ్ళాముకు తామంటే భయం నేర్పుతుంటారు. ఆడదానిపై తమదే పై చేయి కానప్పుడు కూడా పిల్లల్ని ఎత్తుకుని పారిపోతూ వుంటారు . . ఇది మా ఇళ్లల్లో మామూలు . ఆడది అణిగి మణిగి పడి ఉంటాలంటే ఇలాంటిది తప్పు కాదు అని మా తెగ

పెద్దలు అంటారు . అందుకని మా భేటీ తో రన్నింగ్ చేయిస్తున్నాను . రేపు దీని మొగుడు దీని బిడ్డను లాక్కొని ఆటో ఎక్కి వెళ్లి పోతూ ఉంటే .. ఇది ఆటో వెనుక పరిగెత్తి వేళ్ళ పోలేక పోతే దాని బిడ్డ దానికి దక్కుతుందా?? . దాని పరుగు చూసి నాకా ఎవరైనా పెద్దలు కలుగ చేసుకొని ఆటోని అడ్డగించి ఆపక పోతారా ?.ఆటో వాడు మా మనిషి కాదు కాబట్టి, ఆటో వెనక పరుగెత్తు కొని వస్తున్నా ఆడదాన్ని చూసి ఆటో వాడు తప్పక ఆగుతాడు . అదే నా పిల్ల ఆటో వెనుక పరుగెత్తలేక ఆటో వెళ్లిన దారిలో నడుచుకుంటూ వెడితే ఏమి ఉపయోగం వుంటుందంటారు ? అందుకని మా భేటీని ఆటో వెనుక పరిగెత్తే దానికి తయారు చేస్తున్నాను "

అప్పుడు నేను " భేష్ అయినా పని చేస్తున్నావమ్మా . స్త్రీల మీద దాష్టికాలు అనేకం . ఒక వేళా అర్ధరాత్రి పూట - భర్త వచ్చి పిల్లను పక్క లోనుండి మాయం చేస్తే - పిల్లను వెతుక్కుంటూ బస్సు స్టాండ్లకు -అక్కడ నుండి రైల్వే స్టేషన్ కి - అక్కడినుండి పోలీసు స్టేషన్ కి పరిగెత్త టానికి కూడా , నేడు నేర్చుకున్న ఈ పరుగు పనికి వస్తుంది . పిల్లని బాగా పరుగెట్టించు " అని చెప్పి , అవికాక మంచివి అనుకున్న మరి రొండు మాటలు కూడా చెప్పి, ఆమెకు వత్తాసు గా నిలిచాను .
ఆమె కూతురు ఒక రౌండ్ పరిగెత్తి రొండో రౌండ్ చేస్తూ మాకు సమీపంలోకి రాగానే - " రన్ బేబీ రన్ " అని నిజంగానే అరిచాను

------------------------------------------------------------------------------------------

## 21. మూలికా మహత్యము 22-11-22

ఇంటిలోని పోరు ఇంతింత కాదయ్యా అనుకుంటూ ఇంట్లోకి వచ్చాడు విశ్వనాధ్. అతనికి నాలుగేళ్ల క్రింద పెళ్లాడిన భార్య , నభయ్ ఏళ్ళక్రింద కన్న తల్లి ఇంట్లో వున్నారు .
అతని తల్లి, కోడలిని ఎప్పుడూ ఎదో ఒకటి అంటూనే ఉంటుంది .
కోడలు అత్తతో యుద్ధానికి దిగుతూ ఉంటుంది .
పగలల్లా జరిగిన ఈ తగాదాల సారాన్ని - విశ్వనాధ్ కి వివరించి " అది నన్ను ఎంత లేసి మాటలు అంటుందో నీకు తెలీదు .నీ భార్యకు

మంచిగా బుద్ధి చెప్పు " అని కన్నీరు పెట్టుకుంటుంది అతని తల్లి రమాదేవి .
పగలల్లా జరిగిన ఈ తగాదాల సారాన్ని - భర్త విశ్వనాధ్ కి వివరించి " మీ అమ్మ నన్ను ఎంత లేసి మాటలు అంటుందో ఏమిటో మీకేమీ తెలీదు. మీ అమ్మను కంట్రోల్ లో ఉండమని చెప్పండి. లేకపతే తేడాలు వస్తాయి " అని కన్నీరు కార్చేస్తుంది విశ్వనాధ్ భార్య సుధా రాణి.
విశ్వనాధ్ ఇంటికి వచ్చి టీ తాగి పెండింగ్ వర్క్ చూసుకోవటానికి తన ఆఫీస్ రూమ్ లో కూచున్నప్పుడు - అతని తల్లి , ఇక బొజ్జ నిండాతిని పడుకోవటానికి వెన్ను వాల్చిన వేళ అతని పత్ని - వారి వారి వాదనలు విని పించి - విశ్వనాధం యొక్క జడ్జీ మెంట్ అడుగుతారు . ఇది శని ఆది వారాలు తప్ప ఇది అన్ని రోజులూ జరిగే కోర్టు.
ఈ రోజున ---- కొడుకు ఆఫీసు గదిలో పని చూసుకుంటుండగా తల్లి వచ్చి "అదేదో తెప్పిస్తానన్నావు . తెప్పించావుటరా ? అని గుసగుసగా .. అడిగింది .
" ఆ ఇంటర్ నెట్ అంత వెతికి వియత్నాం నుండి ఓ చైనా మూలిక తెప్పించానమ్మా . నీవు దీన్ని 24 గంటలుపాటు ఫ్రిజ్జులో పెట్టి .. ఆ తరువాత దాన్ని 48 గంటల పాటు -ఎండపెట్టి , మెత్తగా పొడిలా దంచి , అది అంటే నీ కోడలు తినే తిండిలో కలుపు. ఈ మూలికకు రంగు రుచి వాసన ఏమీ వుండవు . అద్భుతమైన పని తీరు తప్ప . ఈ మూలిక సారం నీ కోడలి కడుపులోకి పోయినాక - దానిరక్తం లో అనేక మార్పులు జరిగి, దానికి కోపం రాగానే దాని స్వర పేటిక మూసుకు పోతుంది . మాట పెగలదు . కోపం తగ్గిన గంటసేపటికి కానీ స్వర పేటికమామూలు కాదు . అప్పుడు కానీ మాట పెగలదు . ఇహపై నువ్వు నీ కోడల్ని ఇష్టం వచ్చినట్లు అను . అదిఏమీ బదులు చెప్పలేదు . నీ ప్రాబ్లెమ్ సొల్వెడ్ . వచ్చే సండే తరువాత మూలిక పని పెట్టుకో " అని తల్లికి చెప్పాడు విశ్వనాధ్.
ఇదంతా చెప్పేటప్పుడు అతడు కావాలనే కొంత స్వరం పెంచి చెప్పాడు . పక్క గదిలో గోడకు చెవులు ఆనించి వింటున్న భార్య సుధకు అంతా క్లియర్ గా వినపడాలని . ఆమె కూడా అంతా క్లియర్గా నే విని . నో డౌట్స్ అనుకుంది .
విశ్వనాధ్ బెడ్ రూమ్లోకి రాగానే సుధా నేరుగా విషయానికి వచ్చింది . అప్పుడు విశ్వనాధ ఏమి చెప్పాడంటే " . నీకోసంకూడా ఒక మూలిక తెప్పించాను . ఇది కోడలు వెర్సెస్ అత్త మూలిక . అదేమో అత్తా వేరేసెస్ కోడలు మూలిక . మా అమ్మకు చెప్పిందంతా విన్నావుగా ? నువ్వుకూడా

ఈ మూలికను దంచి పొడి చేసి మా అమ్మకు తినిపించు . ఆమె రక్తంలో మార్పు వచ్చి - నీమీద కోపం రాగానే ఆమె కంఠం మూసుకు తొతుంది . నువ్వు హేపీ గ ఉండొచ్చు " అని
టీవీ మ్యూట్ లో పెట్టి భార్య భర్తల సంభాషణను చెవులు రిక్కించి వింటున్న తల్లికి విషయం అంతా స్పష్టంగా భోద పడింది .
" మనం ఎవరితోనన్న సఖ్యత గాను స్నేహంగాను ఉంటే వారు తొందరపడి మన కి హాని చేసే పాపానికి తలపెట్టారు గదా ? అని అలోచించి 25 %,
" కోపాలు తెచ్చు కోవటం ఎందుకు ? గొంతులు పోగొట్టుకోవటం ఎందుకు ?? " ఆలోచిస్తూ మరో 25 %,
" కోడలు తన మీద ఎప్పుడు మూలిక ప్రయోగిస్తుందేమో అనే50 % భయంతో అత్తా , అత్త తన మీద ఎప్పుడు మూలికా ప్రయోగం చేస్తుందో నాన్న 50 % భయం తో కోడలు , తమ తమ హద్దుల్లోకి ఒదిగి పోయారు .
కోడలు తన మూలికను తన పుట్టింటికి పంపి దంపించిన పొడిని తెప్పించి తన మీద చాటు మాటుగా ప్రయోగిస్తుందేమో ననీ అత్త గారికి లోలోపల భయం వుంది . అత్త గారు తన మూలికను తన తమ్ముడి ఇంటికి పంపించి దంపించిన పొడిని తెప్పించి తన మీద ప్రయోగిస్తుందేమో ననీ, కోడలికి లోలోపల భయం వుంది . ఈ భయం మూలంగా అత్తా కోడళ్ల ప్రేమ మరింత బల పడింది
అసలు ఈ మూలిక ప్రాయోగాన్నే అడ్డుకోవాలి అన్న ధ్యేయంతో , ఇదివరకు అత్తగారు వంటచేస్తూ ఉంటే పడకటింట్లో దూరే కోడలు నేడు వంట జరిగినంత సేపు అత్తగారికి అసిస్టెంట్ గా ఉంటుంది .
కోడలు కాఫీలు టిఫిన్స్ తయారు చేయటం పూర్తయ్యే వరకు నిద్ర నటించి -అప్పుడు నిద్రలేచి కాఫీ కోసం కేకవేసే అత్తగారు నేడు, ప్రతి చిన్నపనిలో కోడలికి వత్తాసుగా నిలబడి ఉంటుంది.
నిజమైన పస ఏమీలేని ఆ మూలిక ప్రయోగం జరగకుండా నే ఒకరితో ఒకరు ఆప్యాయతపంచుకుంటున్నారు అత్తా కోడళ్ళు .
మూలికా మహత్యనా మనవాడికి ఇంటి పోరు తగ్గింది .

---

**22-ఈ కేసులోని నీతి 13-12-22**

**a original by varanasi sree rama krishna**

.తాల్లూరి కాంతారావుగారిని అందరూ తగాదాల కాంతారావు అంటారు . దేని మీదనైనా సరే - తగాదాలు పడటం లోనూ , పట్టు విడవకుండా వాదులాడటం లోనూ -పిచ్చి పట్టు పట్టటం లోనూ ఈయన తరువాతనే ఎవరైనా .నేటి సమాజంలో ఇలాంటి వారు కోకొల్లలుగా వున్నారు కాబట్టి మనం ఈయన కధ తెలుసుకోవాల్సి వచ్చింది .

ప్రస్తుతం టీ కే రావుగారు - ఒక చిన్న పల్లెటూరు రైల్వే స్టేషన్ లో - అక్కడి స్టేషన్ మాస్టర్ తో తగాదా పడుతున్నాడు . రైలు సకాలంలో స్టేషన్ లోకి రాలేదు -దానికి నీ అసమర్ధతే కారణము అనే ఆరోపణ చేస్తూ , విడవకుండా స్టేషన్ మాస్టారు గారితో తగాదా - లాగుతున్నాడుటీ కే రావు గారు

.

అసలు ఏమి జరిగిందంటే ..ఫలానా రైలు సాకాలంలో వస్తున్నదని ప్రకటించారు . కానీ అనుకున్నట్లుగా రైలు రాలేదు . స్టేషన్ లో నిలబడి చూస్తున్నవారికి దూరంలో రైలు కనబడుతోంది కానీ అది స్టేషన్ లోకి రావటం లేదు. చివరికి ట్రైన్ టైం టేబుల్ లో చూపిన సమయాన్ని మించి ఒక గంట దాటేసింది .ఈలోపుగా టీకే రావుగారు పావు గంటకొక సారి ఆవేశం పొంది. వెళ్లి స్టేషన్ మాస్టారుగారిని కెలికాడు . నిండా ఒక గంట కాగానే - మైండ్లో ఎదో భూకంపము తెచ్చుకొని వీరావేశంతో వెళ్లి " టైం టేబుల్ ప్రకారం రైలును సకాలంలో ప్లాట్ఫారం మీదకు తీసుకో రాకుండా మీరేమి చేస్తున్నారండి ? గాడిదలు గాస్తున్నారా ?? అని ఆ స్టేషన్ మాస్టర్ మీద ఎగిరి పడ్డాడు .

చోద్యంచూస్తున్న కొంత మంది ఈయనకు వెనుకగా వచ్చారు . వారిని చూసి -ఈయన మరింతగా తన మాటల జోరు పెంచాడు . వివాదాన్ని పెద్దది చేసాడు. టైం టేబుల్ ప్రకారం రైలును స్టేషన్లోకి తీసుకు రాలేని వాడివి నీవు ఈ వుద్యోగానికి అన్ఫిట్ అన్నాడు .నూవ్వు దేనికీ పనికి రావు -

అని నిందించాడు .
అసలు ఏమి జరుగుతున్నదో తెలియక ,జరుగుతున్న ఆలస్యానికి పిచ్చెక్కి పోతున్న జనం మధ్య, ఆ జనం ఒత్తిడికి తట్టుకోలేక స్టేషన్ మాస్టర్ కూడా పిచ్చెత్తి పోతున్నాడు .
ఈ గుంపును చూసి అక్కడికి వచ్చిన ఒక పోలీసు ఆయనతో - " ఈ యన నా విధులకు ఆటంకం కల్గిస్తున్నాడు - ఈయన్ను లాక్కెళ్లి ప్లాట్ఫారం చివర కూచో పెట్టండి" అని ఆర్డర్ వేసాడు స్టేషన్ మాస్టర్ . పోలీసు అయన టీ కె రావు గారిని జబ్బపట్టి బయటికి తీసుకో వెళ్ళాడు .

ఇప్పుడు చూద్దాము, అసలు రైలు ఆలస్యానికి కారణం ఏమిటి? అనేది . రైలు స్టేషన్ ని సమీపిస్తుండగా - ఒక దున్న పోతు దానికి గుద్దుకొని చని పోయింది . దాని రక్తం - ఇంకా మాంస ఖండాలు ఇంజిన్ ముందు భాగం పైకి వెదజల్లబడి -రైలింజను ముఖము అంతా భయంకరంగా తయారయ్యింది . ఈ భయానకమైన ఇంజను చూసి ప్లాట్ఫారం మీద వుండే పాసెంజర్లు ఏమి ఇబ్బంది పడతారో ఏమో మోనని ఆలోచించిన రైలు డ్రైవర్ ఇతర రైల్వే సిబ్బంది కలిసి ఇంజెన్ని శుభ్రం చేయటంలో- కాలం ఖర్చు అయినా మూలన్నీ , రైలు ప్లాట్ఫారం మీదకు రావటం ఒక గంట ఆలస్యం అయ్యింది . అదీ సంగతి .

రైలు మొత్తానికి ప్లాట్ఫారం మీదకి వచ్చింది - పోయింది. టీకే రావు గారు మాత్రం రైలు ఎక్కలేదు . పోలీసు ఆయన " వెళ్ళండి మాస్టారు - రైలు ఎక్కేయండి " అనిరావు గారిని ప్రోత్సహించినా , బ్రతిమాలినా కానీ అయన రైలు ఎక్కలేదు . స్టేషన్ మాస్టర్ వచ్చి తనకు " ఆపాలజీ చెప్పాలని " డిమాండ్ చేసాడు . అంటే ఈయన వివాదాన్ని కొత్త పుంతలు తొక్కించాడు . ఆ తరువాత " మీ స్టేషన్ మాస్టర్ నన్ను రైలు ఎక్కనివ్వలేదు " అని పై అధికారులకి టెలిగ్రాంలు కొట్టాడు .అంటే తనకు క్షమాపణ కావాలని పిచ్చి పట్టుకు దిగాడు .
టీకే రావుగారి కంప్లైంట్ వల్ల ., అసలేమీ జరిగిందో తెలుసుకుని , స్టేషన్ మాస్టర్ మీదచర్య తీసుకొనే దానికని. ఒక ఎంక్వయిరీ కమిటీ వచ్చింది . ఒక సిట్టింగ్ జడ్జీ గారు దానికి ముఖ్య విచారణ అధికారి .

అసలు రైలు ఎందుకు ఆలస్యం ఐయ్యిందన్నది, టీ కె రావుగారిగికి తెలుస్తూనే వుంది . కానీ ఈయన వెనక్కి తగ్గేదేలే .. అని కూచున్నాడు . " సార్ ఇదీ రైలు లేటుకు కారణం అని, సారీ ఫర్ ది లేట్ అని - అతడు అప్పుడే వచ్చి నాకు సారీ చెప్పివుండవలసింది . అతడు ఆలా చెప్పలేదు - అదే ఇక్కడ ఇష్యూ " అని వాదనలు ఆడుతున్నాడు . "ఐన దానికి కానీ దానికివాదులాటకి దిగి యెదుటవారిదే తప్పు అని ఎంచుతూ - ఎదుట వారు "సారీ"చెప్పని దాకా వదలని వారు కొందరుంటారు . సారీ చెప్పించుకోవటం వారి దృష్టిలో ఒక విజయం. ఇలాంటి వారు కోకొల్లలుగా వుంటారు " అని కేసు స్టడీ చేసిన . మన జడ్జీ గారు అనుకున్నారు

అప్పుడు జడ్జీ గారు " అసలు మీ టైం టేబుల్ ఏమిటి ?" అని రావుగారినిప్రశ్నించాడు

రావుగారు తన దిన చెర్యను ఏకరువు పెట్టాడు .

" ఆబ్బె అది కాదు ..ఏ వేళప్పుడు ఏమి మందులు వేసుకోవాలి ?ఎంత తినాలి ? ..ఏమి తినాలి ?.. ఎంతలో ఎంత ఉప్పు ఉండాలి -అని చెపుతూ డాక్టర్ మీకేమీ టైం టేబుల్ ఇవ్వలేదా ? దాన్ని గురించి అడుగుతున్నాను " అన్నారు జడ్జి గారు.

నిజానికి టీ కె రావు గారు కి, ఆయన డాక్టార్ గారు ఒక టైం టేబుల్ ఇచ్చే వున్నాడు . కానీ ఈయన దాన్ని అమలు చేసిందే లేదు .

అప్పుడు జడ్జీ గారు ఇలా ఆదేశం ఇచ్చారు " కేసును నెలరోజులు వాయిదా వేస్తూ వున్నాను . ఈ నెల కాలం పాటు. ఈ టీకే రావు గారి ని - వారి డాక్టర్ గారు తమ హాస్పిటల్ లో , స్పెషల్ గదిలో ఉంచి - మెడికల్ ప్రకారం ఒక వ్యక్తి రోజూ ఎంత అన్నం తినాలో అంతే కొలత - అలాగే, మెడికల్ ప్రకారం మనిషికి దినమూ ఎంత ఉప్పు అవసరమో అంతే కొలత ప్రకారం ఉప్పు వేసిన కూరలతో భోజనం పెట్టి - ఇతడికి మెడికల్ టైం టేబుల్ అమలు చేయాలి అని ఆదేశిస్తూ వున్నాను " అని

నెల రోజుల తరువాతి వాయిదాలో " నాకెవరి క్షమాపణలూ అక్కరలేదు - ఐ యాంవెరీ సారీ " అన్నాడు - మన టీ కె రావూ జీ . పెడుతూ

ఉప్పు తగ్గితే కానీ తిక్క తగ్గదు . .తిక్కతగ్గితే కానీపట్టు తగ్గదు . పట్టు తగ్గితే

కానీ తగాదాలు వాదాలు - జగడాలు తగ్గవు . ఇవే లేక పోతే , ఇక లోకం అంతా ఎంతో హాయిగా ఉంటుంది . అదే ఈ కేసులోని నీతి

---

## 23-పుట్టుకతో పాటు వచ్చే పిచ్చి . 12-12-22

ఒకాయన, ఆ క్షణం వరకూ ఆయన ఎంతో కష్టపడి ఎస్టిమేట్లు తయారుచేసి, ప్రభుత్వం వారినుండి ఫది కోట్ల పైగా విలువైన సప్లై పనులు దక్కించుకున్నాడు .ఈ వార్త తెలిసినాక ఆయన అప్పటి దాకా పడిన శారీక, మానసిక శ్రమ తాలూకూ వత్తిడులు అన్నీ తొలగి పోయి నిద్రముంచుకొని వచ్చింది. సోఫాలో కూచున్న వాడు కూర్చున్నట్లు గా నిద్రలోకి జారుకున్నాడు .

నిద్రలో ఆయనకుఒక కల వచ్చింది . అందులో ఆయన దాహంతో పరితపిస్తూ నీరు ఎక్కడ దొరుకుతుందా ? అని వెతుకుతూ ఒక ఎడారిలో తిరుగుతున్నాడు . ఈ కల యొక్క ఉద్దేశ్యము - ఆయన్ని నిద్ర లేపి నీరు తాగేట్లు చేయటం . కానీ అయన మెదడు అప్పటి వరకూ చాలా ఒత్తిడిలో అలసి ఉండటం వల్ల - అది తనకు దొరికిన విశ్రాంతిని భంగం చేసుకో దలుచుకో లేదు . ఈయన్ని మెలకువలో కి తేలేదు .

ఈయన తన కలలోనే ఎడారి లో తిరుగుతూ - ఒక ఎండమావి వెంబటే పడ్డాడు .ఎండమావి అనేకసార్లు దూరం జరిగీ జరిగీ చివరికి ఈ యన్ను నిజంగా నీరున్న ఒక సన్నని నీటి పాయ వద్దకు తీసుకో వెళ్ళింది . ఈ యన ఆ నీటిని కడుపారా తాగాడు . తాగినాక నీటిని పరిశీలించగా . స్వచ్ఛమైన ఆ తేట నీటి అడుగున కంకర రాళ్లంతబంగారపు రాళ్ళు కనపడ్డాయి . నీరు కనపడిన సంతోషంతో వున్నా ఆయనకు బంగారం అంత మీదా గా కనపడలేదు . కానీ ఎదో ఆసక్తి కొద్దీ రొండు రాళ్ళూ తీసి జేబీలో వేసుకున్నాడు ..

" ఏమండీ రాత్రి ఎప్పుడో ఫది కి అనగా పడుకున్నారు . ఇప్పుడు మధ్యాన్నపు భోజనాల వేళా అయ్యింది . లేవండీ" అని చెప్పి ఆయనభార్య ఆయన్ను నిద్రలేపి భోజనాలకి తీసుకెళ్లింది .

ఆయన తన కలనంతా భార్యకు వివరించి - చివర్లో జోబీ తడుముకున్నాడు . అందులోనుండి రొండు చిన్న, అంటే చింత పిక్కల అంతటి రాళ్లు బయటికి తీసాడు .

మీరు ఊహించినట్లు గా అవి బంగారపు రాళ్లు ఏ .

ఆనాటి నుంచి అయన పిచ్చి ఎక్కి పోయాడు . తిరిగి మామూలు మనిషి కాలేదు. " నేను చాలా తెలివి తక్కువ శుంఠను. పాంటు కు నాలుగు జేబులు వున్నవి . చొక్కాకి రెండు జేబులు వున్నవి . వీటి అన్నింటి నిండా ఆ నీటిలోని రాళ్లను నింపుకో ని వచ్చి వుండాల్సింది '. అన్న ఆలోచన తో అయన మతి కోల్పోయాడు .
ఎండమావిలోని బంగారము నిజమైనపుడు - ఆ కలలోని ఎండమావి . అందులో పారుతున్న నీరు, అన్నీ కూడా నిజమే గా ? భగవంతుడే పూనుకొని ఇన్ని నీళ్లు ఏర్పాటు చేసి నాచే త తాగించాడు . నేను నిద్రలేస్తూ నే నీటికోసం అడగకపోవటమే ఆయన ఆ నీరు తాగిన దానికి సాక్ష్యము ."ఇట్లాటి అదృష్టము ఎందరికి పడుతుంది ? అని ఆలోచించలేక నూ , దొరికిన దానితో సంతృప్తి చెందలేకనూ అయన పిచ్చి వాడు అయినాడు
అసంతృప్తి అనేదే మానవులకు పుట్టుకతో పాటు వచ్చే పిచ్చి .
**a original by varanasi sree rama krishna**

---

**24- కేరింతల ఉయ్యాల 09-12-22**

బాల శ్రీ కృష్ణుడిని వధించటానికి కంస మామ అనేక మందిని ప్రయోగిస్తూ ఉన్నాడని ఒక రాక్షసునికి తెలిసింది . కృష్ణుని వధిస్తే వచ్చే ఆ పేరే వేరు, అనుకుంటూ ఆ రాక్షసుడు కంసుని దర్శనం చేసుకొని " నేను నా కాళ్ళూ చేతులను ఉక్కు తీగలకు వల్లే ఎంత దూరమైనా సాగ తీసుకోగలను . మీరు నాకు ఆనతి ఇస్తే నేను ఒక చెట్టు కొమ్మ మీద పడుకొని నా కాళ్ళూ చేతులూ క్రిందకి వేలాడేసి అవి ఏవో గట్టి చెట్టు తీగలు అనే భ్రమ కల్పిస్తాను . కృష్ణుడు గోవులు కాయటానికి వచ్చినపుడు , మిత్రులతో కలిసి ఊయలలు ఊగుతూ ఉంటాడు . నేను అతన్ని ఎలాగైనా ఆకర్షించి - అతడు నా మీద ఊయల వూగేట్లు చేసి - అతడు ఊయల వూగుగుతూ ఉండగా - నా శక్తీ ప్రదర్శించి అతన్ని ఆకాశం ఎత్తుకు తీసుకు వెళ్లి - అక్కడ ఆ చెట్టు తీగలు అంటే నా చేతులు కాళ్ళునా మొండెం నుండి విడిపోయేట్లు చేసుకుంటాను . కృష్ణుడు మరణించటం ఖాయము . ఒక ముని వరం వల్ల తెగిపోయిన నా కాళ్ళూ చేతులు నాకు తిరిగి నాకు మొలుస్తవి " అని చెప్పాడు
కృష్ణుడు గోవులు తోలుకుంటూ వచ్చి ఊయల చూసాడు .ఎక్కాడు . ఉయ్యాల రాక్షషుడు ఒక కొమ్మను వాలుగా వంచి దానిమీద తాను నిలువుగా పడుకొని కాళ్ళు చేతులు క్రిందకు వేలాడేసి ఉయ్యాల తాళ్లను - తన అరచేతులతో ఒక ఉయ్యాల బల్లను సృష్టించాడు . నిన్న

నిటారుగా వున్నా కొమ్మ నేడు నేలకు సమాంతరంగా వంగి ఉండటం చూసి కృష్ణుడురాక్షస మాయ ను పోల్చుకున్నాడు ఆ తరువాత ఆ రాక్షసుడు పడుకొని వున్నా కొమ్మకు పైన వున్నా ఇంకో కొమ్మను చూసి కన్ను గీటాడు . ఆకొమ్మ నిదానంగా కదులుతూ కింద కి జరిగి - రాక్షశుడుని కిందకొమ్మకేసి అదిమి పెట్టింది .వాడి పరిస్థితి మొసలి నోటిలో చిక్కిన కుక్కలా అయ్యింది .

" అయినా నా పనికి ఏమీ ఆటంకం లేదులే కృష్ణుని చంపే తీరు తాను" అని రాక్షషుడు బింకంగా అనుకున్నాడు . ఎందుకంటే వాడి కాళ్ళూ చేతులూ ఇంకా వాడి ఆధీనంలోనే వున్నాయి గదా ? అదీ సంగతి . కృష్ణుడు అతడి మిత్రులూ ఊయల లు వూగుతుండగా రాక్షశసుడి ఊపిరితిత్తులు నుజ్జు నుజ్జు అయి - వాడు గావు కేకలు పెట్టాడు . కానీ ఆకేకలు మాత్రం పిల్లల చెవుల్లో " ఊగూ ఊగూ ఇంకా ఊగూ " అంటూ గాలి చెపుతున్నట్లు వినిపించాయి .కృష్ణుడు తూగుటుయ్యాలలు ఊగుతున్నాడు . ఒక ఊపు లో దూరం పెంచుకున్నాడు . ఆకాశాన్ని అంటాడే అనుకోవాలి . కిందనుండి చూస్తున్న గోప బాలురు కేరింతలు కొట్టారు . ఆ కేరింతల్లో వున్నా బలానికి విష్ణు మహిమ జోడు అయి - రాక్షషుని చేతులు వాడి మొండెంనుండి విడి పడటానికి బదులు - టంకం వేసి అంటించినట్లు మరింత గట్టిగా అంటుకు పోయాయి .పిల్లలు పెట్టె కేరింతల వల్ల తనలో ని ఓపిక అంతకి అంత పెరుగుతున్నట్లు . ---- ఇంతకు ఇంతా అనుభవించక , తాను మామూలు చావు చావనని రాక్షషుడు గ్రహించేసాడు .

ఇటు పిల్లల కేరింతలు .అటు ఎవరికీ వినపడని రాక్షషుడి బొబ్బరింతలు ..

పిల్లలు కేరింతలు కొట్టినంత కాలం తాను ఈ నరకం భరించాలిసినదే అని - ఇదే కృష్ణ మాయ అంటే అని- ఆ పిల్లవాడి ముందు తన పప్పులు ఉదకవని ఆ రాక్షషుడు - గ్రహించి అట్లాగే ఆ రొండు కొమ్మల మధ్యా చాలా కలం జీవనం చేసి కాలం చేసాడు .

కేరింతలు కొడుతూ ఊయలలు ఊగినపుడు - ఏ ఆపదా జరగదని - అపుడు ఊయల తాళ్ళు తెగవని , తమ పిల్లలకు చెప్పటం కోసం - అని కొందరు తల్లులు ఈ కధని వుయ్యాలముందు పిల్లలకు చెప్పి , వారిని ఊయల లు ఎక్కిస్తారు .

ఈ కృష్ణ కదా మహిమవల్ల అధైర్యపు పిల్లలను కూడా ధైర్యవంతులవుతారు అని ఇక్కడ స్త్రీలు అందరూ నమ్ముతారు .

**A ORIGIAL BY VARANASI SREE RAMA KRISHNA**

---------------------------------------------------------------------------------------------

**25- పిచ్చి ధర్మరాజు 1-12-22**

మహాభారతం అనేది మనకాలం లో జరిగితే మనము ఎవరి పక్షమో ఒకరి పక్షము ఉండేది తప్పని సరి అయివుండేది . e పల్లెటూరి కథలో .
ధర్మయ్య అని , ఒక మోతుబరి రైతు ఉంటాడు . అతనికి అరవై డెబ్బై ఎకరాల కమతం వుంది . అతన్ని ఆ ఊరి వారు అందరూ పిచ్చి ధర్మరాజు అని పిలుచుకుంటారు . పిచ్చి అనే బిరుదుకు అర్ధం ఏమంటే, ఒక్క మాటతోనో ఒక్క అబద్ధముతోనో లౌక్యంగా పరిష్కరించుకోవాలిసిన లౌకిక విషయాలను - మరీ ధర్మ బద్ధంగా పరిష్కరించుకొ చూసేవాడు అని . నిజానికి పిచ్చి ధర్మరాజు అంటే ఎంతో ఉదారుడు, అని, ఒక పల్లెటూరి పొగడ్త .
ఒక పంట సంవత్సర కాలములో - ధర్మయ్య పొలానికి కుడివైపున వున్నా దుర్గమ్మ అనే ఆవిడ పొలానికి వారసుడైన ఆమె ఒక్కగానొక్క కొడుకు - గోవిందం అనేవాడు - ధర్మయ్య గారి పొలంలో కి ఒక అరెకరం పైగా కబ్జాచేస్తూ పొలం దున్ని పంట వేసుకున్నాడు . పిచ్చి ధర్మయ్య చోద్యం చూస్తూ ఊరుకున్నాడు .
మరుసటి పంట సంవత్సర కాలములో - ధర్మయ్య పొలానికి ఎడమ వైపున వున్న సుబ్బులు అనే ఆవిడ పొలానికి వారసుడైన ఆమె ఒక్కగానొక్క కొడుకు - జగ్గన్న అనేవాడు - ధర్మయ్య గారి పొలంలో కి ఒక ముప్పాతిక ఎకరం పైగా కబ్జాచేస్తూ పొలం దున్ని పంట వేసుకున్నాడు . ఇప్పుడు కూడా పిచ్చి ధర్మయ్య చోద్యం చూస్తూ ఊరుకున్నాడు .
ఇంకో పంట సంవత్సర కాలములో - ధర్మయ్య పొలానికి వెనుక హద్దుగా వున్న పార్వతమ్మ అనే ఆవిడ పొలానికి వారసుడైన ఆమె ఒక్కగానొక్క కొడుకు - రామన్న అనేవాడు - ధర్మయ్య గారి పొలంలో కి ఒక పావు ఎకరం పైగా కబ్జాచేస్తూ పొలం దున్ని పంట వేసుకున్నాడు .
ఇప్పుడు కూడా పిచ్చి ధర్మయ్య చోద్యం చూస్తూ ఊరుకున్నాడు అనుకునేరు . కాదు అయన రామన్నతో లొల్లి పెట్టుకున్నాడు .
ధర్మన్న- రామన్న హోరాహోరీ పోట్లాడుకున్నారు . మాటా మాట అనుకున్నారు .పొలం గట్ల మీద వున్నా మిగతా రైతులు ఇద్దరి చుట్టూ చేరారు . " ఎంతైనా నువ్వు ధర్మాత్ముడివి కావు . నేనంటే పక్షపాతం

చూపిస్తున్నావు " అంటూ ధర్మన్నను నిందించిన రామన్న వెళ్లి పోయాడు .
" అవును- ధర్మన్న ధర్మంగా ప్రవర్తించటం లేదు - పక్షపాతం చూపిస్తూ వున్నాడు . కుడి వైపునుండి ఒక అరెకరం ఎడమవైపునుండి ఇంకో ముప్పాతిక ఎకరాన్ని ఆక్రమించుకున్న వాళ్ళని వదిలేసి - వెనకనుండి వచ్చి కేవలం ఒక పావు ఎకరం ఆక్రమించుకున్న వాడితో ఈ పోట్లాట ఏమిటి ? అని చర్చించుకుంటూ మిగతా రైతులు వెళ్లిపోయారు .
ఏది ఏమైతే నేమి విషయం గ్రామపు రచ్చబండమీదకి చేరింది .
"ఆయనకు నేనంటే పక్షపాతం" అని తిరిగి ఆరోపించాడు పావు ఎకరం మాత్రమే అక్రమించుకున్న రామన్న .
మళ్ళీ మళ్ళీ వస్తున్నా ఈ ఆరోపణకు ధర్మయ్య నొచ్చుకొని " నేను ధర్మం తప్పే మనిషిని కాదు. నాకు ఎవరి మీద పక్షపాతం లేదు. .
ముగ్గురూ తలా ఒక ఎకరం చొప్పున ఆక్రమించుకోండి " అని పెద్దమనుషుల సాక్షిగా మాట చెప్పాడు .
ఇప్పుడేమి చేయాలో పాలు పోక " ఆలా చేసుకోండి పోండి " అని చెప్పి పెద్దమనుషులు వెళ్లిపోయారు .
పిచ్చి ధర్మయ్య గారికి ఊరిలోనే ఈశ్వరయ్య గారుఅనే ఒక బామ్మరిది వున్నాడు . ఈ అయన అక్కగారినే ధర్మయ్య పెండ్లాడాడు . ఆమె ఒక మొగ పిల్లాడిని కని పురిటి లోనే మరణించింది . ఆ పిల్లాడిని తానె పెంచుతూ , అతడినే అల్లుడిగా చేసుకోవాలని ఆలోచనతో వున్నాడు ఈశ్వరయ్య .
రచ్చ బండ దెగ్గిర పంచాయతీ జరిగిన రోజున ఈశ్వరయ్య వూరిలో లేడు. వచ్చి విషయము విని " మాబావ పిచ్చి ధర్మరాజు అనుకున్నాడు " అనుకునేరు .
కాదు ఆయన డీప్ గా అలోచించి పట్నంలో వున్నా ధర్మయ్య కొడుకుని పిలిపించాడు . ఇతడు ఐ ఏ స్ అయి పట్నంలో సబ్ కలెక్టర్గా వున్నాడు .
అతడు వస్తూ వస్తూ తన అనుంగు మిత్రుడైన ఒక డీ ఎస్ పీ నీ వెంటబెట్టుకొని - పోలీసు కారులో సైరెన్ మోగిస్తూ ఊళ్లోకి వచ్చాడు .
" ఏంటి మామ విషయం ? అని ఈశ్వరయ్యను అడిగాడు . ఈ స్వరయ్య నవ్వి " నేనేమన్నా చెబితే - నాపిల్ల మేలుకోసమని నేను నీకేదో విషం నూరి పోశానని అందరూ , అనుకోవచ్చు . కాబట్టి వూర్లో తిరిగి విషయం ఎంక్వయిరీ చేసుకొని- పొలం కట్టడి చేసుకో - అని చెప్పాడు .
పిల్ల కలెక్టర్ గారు ఊరంతా తిరిగి పెద్దలందరినీ విచారణీ చేసాడు .

ఆ విచారణలో తేలింది ఇది . <>ధర్మయ్యకి చిన్న వయసులోనే భార్యపోవటంతో - అయన పొలానికి కుడివైపున వున్నా దుర్గమ్మ అనే ఆవిడా తో సరసం చేసి ఆమెకో కొడుకును ఇచ్చాడు
ఇలాగేఎందుకైనా పనికొస్తాదని ఆయన పొలానికి ఎడమ వైపున వున్న సుబ్బులు అనే ఆవిడ ధర్మయ్య ఆలనా పాలనా చూసి తలంట్లు పోసి చివరికి ఒక కొడుకును పుచ్చుకుంది .
నేనేమి తక్కువ అన్నట్లు , ధర్మయ్య పొలానికి వెనుక హద్దుగా వున్నా వున్న పార్వతమ్మ అనే ఆవిడ కూడా ధర్మయ్యకి రాత్రి పూట పళ్ళు పాలు పరోటాలు చపాతీలు అమర్చి పెట్టి , చివర్లో పండంటి మొగపిల్లాడిని కంది .
ఈ ముగ్గురు ఆడవాళ్ళ పోరు పడలేక వాళ్ళ మొగుళ్ళు వాళ్ళని వదిలేసి రంగం పోయినాకనే ఈ బిడ్డలు పుట్టారు .
ధర్మయ్యకున్న ఈ కేబుల్ కనెక్షన్స్ ఎవ్వరికో తప్ప తెలీవు .పిల్లకాయల్ని కన్నతల్లులకు వయసు మీద పడి- లోకం బెరుకు వదిలి - కొడుకుల మీద ప్రేమ పెరిగి, వారిని స్థితి మంతులను చేయాలన్న ఆలోచన బలమైన పిమ్మట లో - కొడుకులకు ధర్మరాజునుండి కొంత ఆస్తులు చిక్కించాలని భావించి - తమకు పుత్ర దానం చేసిన పిచ్చి ధర్మ రాజుగారిని చూపి "అదిగో మీ అయ్య " అంటూ కొడుకుల కు పరిచయం చేశారు . తల్లే చెప్పినాక కాదనేముంది అని . కొడుకులుకూడ మేము అయన ఏ తమ తండ్రి అని మనస్సులో సమాధాన పడ్డారు.
అందువల్ల ముగ్గురిలో మొదటి వాడైనా గోవిందం అనేవాడు - " నా తండ్రి ఆస్తి నేను ఆక్రమించుకుంటే తప్పేమిటి ?" అని మనసులో తర్కించుకొని - ఒక అరఎకరా పొలం - ధర్మయ్య పొలం నుండి కబ్జా చేసాడు . ఇది చూసి రెండో వాడైనా జగ్గన్న - ధర్మయ్య గారి పొలంలో నుండి ఒక ముప్పాతిక ఎకరం పైగా కబ్జాచేశాడు . ఈ రెండూ చూసి రామన్న అనే మూడవ వాడు - ధర్మయ్య పొలంలో ఒక పావు ఎకరం పైగా కబ్జాచేస్తూ పొలం దున్నాడు . కానీ ధర్మయ్య దెగ్గరనుండీ లొల్లి ఎదుర్కొన్నాడు . ఈ నేపథ్యంలోనే అతడు " " నేనంటే నీకెందుకింత పక్షపాతము? అని ధర్మయ్యను అడిగాడు .తమకు జన్మ నిచ్చిన తండ్రి అయినా ధర్మయ్య నుండీ కొద్దీ కొద్దిగా పొలం గుంజుకుందామని ఆయన ఇంటిపేరు లేని ఆయన కొడుకులు ప్రయత్నించారు .
" ఇదీ న్యాయంగానే వుంది . నేను ధర్మము తప్పను -నాకు ఎవరిపట్లా పక్షపాతం లేదు అందరూ "తలా ఒక ఎకరం ఆక్రమించుకోండి అంతటితో అంతా ఫైనలు " అన్నట్లు ధర్మరాజుగారు రచ్చబండ మీద

మీద ప్రకటించటంలోని ఉద్దేశ్యము అని చిన్న కలెక్టర్ గారి విచారణలో తేలింది .అయన పోలీసు లను వుపయోగించి తన మారుటి తమ్ముళ్లందరికీ తల ఓ వందగజాల భూమిని ఇచ్చి మిగతా ఆక్రమణ అంతా వెనక్కి నెట్టించాడు .
ఆనాటి నుండీ భారత యుద్ధము ప్రారంభం అయ్యింది ." మాకూ ధర్మయ్య గారి పొలం లో సమ వాటా వుంది - మా డీ యెన్ ఏ అయన డీ యెన్ ఏ టెస్టు చేపించండి " అని " ముందుగా మా అనుభవంలో వున్న భూములు మా స్వాధీనంలో ఉండేటట్లు స్టే ఇప్పించండి అని ఈ ముగ్గురూ కోర్టులకు ఎక్కారు ..
న్యాయ పోరాటం మొదలైంది .
మన పిచ్చి ధర్మరాజు " నేను ధర్మము తప్పే మనిషిని కాదు నాకెవరిమీద పక్షపాతం లేదు అని రచ్చబండ మీద పలకటం నేడు మరో మహా భారతానికి తెరతీసింది . ఇప్పుడు మీరు ఏటో ఒక వైపు ఉండక తప్పదు . ఎటున్నారో? ఏటో ఏమనుకుంటున్నారో ?ఏటో ?చెప్పండ్రి .న్యాయం రెండు పక్షాల వున్నప్పుడే కోర్టు యుద్ధాలు వస్తాయి
**a original by varanasi sree rama krishna of amaravathi**

---

## **26-** పరలోక ప్రయాణం **16-12-22**

సూన్యం సోమేశ్వర రావుగారి పిల్లలు పెరిగి పెద్దయి ఎక్కడెక్కడనో సెటిల్ అయినారు . ఇంట్లో ఆయన ఆయన భార్య సూన్య కాలం గడప సాగారు. ఇట్లా ఈ సూన్యంలో ఎన్నాళ్ళు గడిపినా, చివరికి వెళ్ళ వలసింది ఆ అనంతమైన సూన్యము లోనికి ఏ గదా ?
అదేదో గబుక్కున వెళ్ళిపోతే తిరిగి పునర్జన్మ పొంది సుఖ పడవచ్చును గదా ? అన్న ఆలోచన ఈయనకు కలిగింది . అప్పుడు వేదాంత గ్రంధాలను ఆశ్రయించి ఎంతో చదివి
యోగ సమాధి లోకి వెళ్లి ఇచ్చా మరణం పొందటమే మంచి మార్గం అని కనిపెట్టాడు .
యోగ సమాధి పొందాలంటే ముందుగా భవబంధాలను తెంచుకోవటం అతి ముఖ్యం అని " యోగ వేదాంత సారం " లో రాసివుంది.
భవబంధాలను తెంచుకోవటం లో భాగంగా - భార్యకు ఎదో గట్టి ఏర్పాట్లు చేసి చివరికి ఆమెకీ మరి ఎవరికీ కూడా చెప్పకుండా - ఎవరితోనూ సంప్రదించకుండా మిగిలివున్న ఆస్తులన్నీ అమ్మి సొమ్ము చేసుకొని

దాన్ని బ్యాంకులో వేసి పెద్ద మూల నిధి తయారు చేసుకొని - ఎవరికీ చెప్పకుండా వెళ్లి - ఒక పల్లె లో ఆశ్రమం లాంటి గుడిసె కట్టుకున్నాడు . ఊరిలోని కరణం గారిని , బడి హెడ్ మాస్టార్ గారిని , ఊరి పోస్ట్ మాస్టారుగారిని ఒక కమిటీగా వేసి - పూర్తిగా తన డబ్బే వెచ్చించి మంచి పనులకు శ్రీకారం చుట్టాడు .
మొదటిది - పేద స్కూల్ పిల్లలకు ధన సాయం చేయటం . సోమేశ్వర రావుగారు ఫది మంది ఎడవ తరగతి విద్యార్థులని గుర్తించి - వారు ఎంత వరకు చదివితే అంతవరకు చదివించేట్లు - కొంత నిధి ని ఇచ్చాడు . ఈ ఫది మంది అయి పోగానే ఇంకో ఫదిమందికి సాయం అందుతుంది .
కూలి పనులకు పోలేక సంపాదన లేక పస్తులుంటున్న పేద వృద్ధులని గుర్తించి - వారికి జీవితాంతం - నెలకు ఇంత అని ఇవ్వటానికి - మరియు చివరిలో వారి మట్టి ఖర్చులకు అని కూడా కొంత డబ్బు ఇచ్చేట్లు నిధిని సమకూర్చాడు .
ఇలాంటివే అయన ఎన్నో పనులకు నిధిని సమకూర్చాడు . నిధి అయిపోగానే యోగ సమాధి సాధించాలని ప్రయత్నం ఆరంభించాడు . కొన్నాళ్ళకి అది సక్సెస్ అయ్యింది .
ఒకనాటి ఉదయం ఆయనకు పనులు చేసి పెట్టె పని మనిషి వచ్చి " అయ్యా ఇవిగో పాలు " అని అయన ముందు పెట్టి , ఎదో అనుమానం వచ్చి మనిషిని కుదిపి చూసింది .
పద్మాసనం లో కూచున్న సోమేశ్వరంగారు బిళ్ళ బీటుగా వెనక్కు పడి పోయాడు ,
ఊరి వారు ముఖ్యంగా,ఊరిలోని కరణం గారు , బడి హెడ్ మాస్టార్ గారు , ఊరి పోస్ట్ మాస్టారు గారు అయన చనిపోయినాడని నిర్ధారించుకున్నారు .
పోస్ట్ మాస్టర్ గారి వద్ద ఈయన కొడుకుల తాలూకు అడ్రెస్స్ లు వున్నాయి . ఈ యన కొడుకు లందరికీ టెలిగ్రామ్ లిచ్చాడు .ఈ కొడుకులు మొత్తం నలుగురు .
తండ్రి ఇంటినుండి వెళ్ళిపోయినాక , వీరు తండ్రిగురించి జాడలు తీసి తండ్రి ఉంటున్న పల్లెని , అయన తన ఆస్తినిఅమ్మగా వచ్చిన డబ్బును దూబరా చేస్తున్న తీరును తెలుసుకున్నారు . మాకు ఆస్తులు చేదా ?మాకిస్తే మేము తినమా ? అని అలిగి , ,ఆస్తి విషయం ఫైసలా అయ్యింది కాబట్టి - తండ్రి ఆచూకీ తెలిసినాగానీ వారు వచ్చి తండ్రిని కలవలేదు .
భవబంధాలు వదులుకున్నాడు- డబ్బు వదిలేసుకున్నాడు . ఇక మనకేమి మిగిలింది అలోచించి అని గమ్మునున్నారు .

పోస్ట్ మాస్టార్ గారికి రిప్లై టెలిగ్రాంలు అందాయి . దరి దాపుగా అందరిదీ ఒకే ఆన్సర్ " సెలవులు లేవు . డబ్బు సమకూర్చుకొని 10 రోజుకి వస్తాము. ఈ లోపుగా మీరు కానివ్వండి - ఖర్చులకు అయన ఎదో అట్టే పెట్టుకొని ఉంటాడు అనుకుంటున్నాము " అని
ఈ టెలిగ్రాములురానూ పోనూ రెండు రోజులు పట్టింది . మూడవ నాడు ఉదయం సోమేశ్వరం గారు కాళ్ళూ చేతులు విదుల్చుకొని పాడెమీదనుండి లేచాడు .
" అయ్యా మీరు చని పోయారని మేము అందరమూ అనుకున్నాము. అందుకే మిమ్మల్ని... "అంటూ చెప్పి కించ పడ్డాడు హెడ్ మాస్టర్ గారు .
" మీ తప్పేమీ లేదండి . యో గా సమాధి ద్వారా ఇచ్చా మరణం చెందాను . ఈ రెండు రోజులూ మీరు సంరక్షించింది నా కళేబరాన్నే ." అన్నాడు సోమేశ్వరం గారు .
" ఎట్లాగా ?ఎందుకు ?ఎల్లా ?తిరిగి వచ్చారు ? అని కరణం గారు ఆరా తీశారు .
" అయ్యా ఇచ్చా మరణం తరువాత మనము వెలుతురు నిండిన గుహ లో నుండి - ప్రయాణం చేస్తాము . గుహ చివరన ఇద్దరు సేకుర్టీ గార్డ్లు వుంటారు .
"రా రా పైలోకాలకి రా " అని దేముడినుండి మనకు అందిన డిమాండ్ నోటీసు లేదా తాఖీదు వాళ్లకు చూపిచ్చక పోతే వాళ్ళు మనకీ వెనక్కి నెట్టేస్తారు . పోవటం పొయాగానీ వాళ్ళు తలుపు తీయందే నేనేమి చేతును ? చివరికేమిటంటే రమ్మన్నప్పుడే పోవాలి .మనంతట మనం పోను వీల్లేదు . ఈ లోగా అనుభవించాల్సిందంతా అనుభవించాలి "
" అయ్యా మీకొడుకులు ఇట్లా అన్నారు " అని ఒక గ్రామస్థుడు చెప్పాడు .
"తండ్రుల కంటే ముందుగా కొడుకులే భవబంధాలు వదిలించుకుకుంటాబు " అని - నేనువెళ్ళిన గుహలో ని గోడమీద బ్లాక్ పెయింట్ తో రాసివుంది . నాలాంటి వాడే ఎవడో రాసివుంటాడుఅది చదివి ఆలోచించుకుని - అందుకు సిద్ధపడే వచ్చాను " అన్నాడు సోమేశ్వరం గారు . "

